# తారకనామప్రభావము.

---



కొండపల్లి వెంకటదాసు

ప్రణీతము.

---

మచిలీపట్టణము

సుధర్మ ముద్రణాలయమునందు

ముద్రితము.

---

1922.

శ్రీ

# తారకనామప్రభావము.




కొండపల్లి వెంకటదాసు ప్రణీతము.

బ్రహ్మశ్రీ చింతలపాటి రామమూర్తిశాస్త్రి

మహారాజశ్రీ వల్లభనేని రామకృష్ణకవివర పరిష్కృతము.

బందరు, సుధర్మ ముద్రణాలయమునందు.

ముద్రాపితము.

1922

# ఉపోద్ఘాతము.

ఆర్యులారా!

నాకు సంస్కృతాంధ్ర పాండిత్యం ఇసుమంతయు లేకపోయినను, పరకవిత్వముచే నీ పాత్రంబును రచించితిని. ఇందులో కొలదిపాటి దోషంబు లుండవచ్చును. వాటిని ప్రాజ్ఞులు మన్నింతురుగాక.

ఈ గ్రంథమును పరిష్కరించిన వల్లభనేని రామకృష్ణయ్య, చింతలపాటి రామమూర్తిశాస్త్రి గార్లకు వందనము లర్పించు చున్నాను.

పొన్నపాడు,
17-8-22.

ఇట్లు విన్నవించు విధేయుడు,
కొండపల్లి వెంకటదాసు.

# తారకనామ ప్రభావము.

—:0:—

కం॥ శ్రీపవిత్రవంశపావన
మాధవముఖ వినుతిపాత్ర సకలపవిత్రా ।
కోసలదేశాధిప నిజ-
దాస జనావన సునామ దశరథరామా ॥ ౧.

కం॥ మతి నతులిత హర్షంబున
సతతము నే నిన్ను వినుతి సలిపెద రామా ।
పతిత జనావన నిపుణా ।
హితవుగ నను బ్రోవు మెప్పు డినకులరమణా ॥ ౨.

గీ॥ విద్యయును బుద్ధి నీజాలు విమలహృదయు ।
వేదములకాది మూలమా వేదవేద్య
ప్రథమ కమలంబు నందుండు ప్రణవరూపు ।
విఘ్ననాథుని సద్భక్తి వినుతసేతు ॥ ౩.

కం॥ భారతి నిను బ్రార్థించెద ।
వారిజదళ సదృశనేత్రి వర్ణితగాత్రి ।
భూరిదయామతి సతతము
చేరి నటింపుము మదీయ జిహ్వాగ్రమునన్ ॥ ౪.

కం॥ శ్రీరామా నిన్నెపుడున్
శ్రీరామా వేడుకొందు స్థిరమతితోడన్ ।

శ్రీరామా నను బ్రోవర ।
శ్రీరామా సుగుణధామ శ్రీరఘురామా ॥ ౫.

అ॥ ఇట్లు ష్టదేవతాస్తుతి యొనర్చి. ౬.

కం॥ ధాముసకు నీలమేఘ
శ్యామునకును సకలముని హృదభిరామునకుఁ ।
భూమి సుతాహృత్కువహిమ
ధాముస కఘదళన పుణ్యతర నామునకుఁ ॥ ౭.

సమర్పితంబుగా సౌనర్పంబూనిన తారకనామ ప్రభా
వంబను యక్షగాన ప్రబంధంబునకు కథావిధానం బెట్టిదనిన.

కం॥ భూమికి వొడవై సిరులకు
ధామము నై జొన్నపాడు తద్దయు నొప్పున్ ।
ధీమహితులతో కొండవ ।
నామముచే శ్రీజనార్దన పురంబనగన్ ॥ ౮.

వ॥ అందుగల పరమభాగవత శిఖామణులగు పుణ్యపురుషు
లొక్క నాడొక్క పుణ్యస్థలంబున గూర్చుండి పుణ్యకథా
కాలక్షేపంబు శేయుచుండ నొక్కండు లేచి యో మహాపుణ్యు
లారా! మన గ్రామ నివాసియగు వెంకటస్వామి యను
నామాంతరముంగల వెంకటదాసుండను భక్తుండు విరక్తుండై
సద్గురూపదేశంబుచే శ్రీహరిని స్మరింపుచు కృతార్థుండయ్యెనని,
మున్ను కొంతవింటి, నిపు డామహాత్ముని సచ్చరిత్రంబును తార
కనామ ప్రభావంబును సవిస్తరంబుగా దెలిసెనేని వక్కాణింపుం
డన నందొక్కం డిట్లనియె, నో మహాత్మా వినుము. వెంటరెడ్డి

కులోద్భవుండును వెల్లసిరి గోత్రుండును సుకవిజన మిత్రుండును కొండపల్లి వంశపయః పారావారరాకా శశాంకుండును నగు శ్రీ మత్తాతిరెడ్డికిని పతివ్రతా తిలకంబగు యాదిలక్ష్మికిని జన్మించిన వారిలో ద్వితీయుండును నగు వెంకటదాసుండను దేవా! మాయారూపంబగు సంసారంబున బురదలో కుమ్మర పురువు చందంబున మెలంగుచు భక్తవరదుండగు శ్రీయఃపతిని స్మరించు విధంబు గురుకరుణచేగాని తెలియదని యప్పుడు తన కుపదేశం బిచ్చుటకు తగు గురువు లేమింజేసి ప్రహ్లాద రక్షకుండగు నరహరినే తనకు తారక ముపదేశమిమ్మని మూఢభక్తిచే ప్రార్థించుచు యమ నియ మాద్యష్టాంగ యోగనిష్ఠా గరిష్ఠుండైనను పంచముద్రల గుర్తెరిగినను పదా సనారూఢుండై భూమధ్యంబున వెలుంగు చిత్స్వరూపుండగు పరమాత్మను జూచుట కెంత ప్రయత్నించినను నూటయెనిమిది దివ్యతిరుపతుల సేవించినను నీ చరాచర ప్రపంచబంతయు నిండియున్న విష్ణువుని గనుంగొనుట యసాధ్యంబనియు నది వైరాగ్య భక్తిచేగాని సాధ్యంబుగాదనియు సాధ్యంబుగాకున్న ముక్తి లేదనియు నిశ్చయించి యా గోవిందుని తన డెందంబున గునుగు పరచి యిట్లు పలుకందొడంగె వినుము ।

కం॥ శ్రీరామ రామ యనుచును
బారాయణ సేతునెపుడు బరమప్రీతిన్ ।
ధీరా నే గురువులైన యీ
తారక ముపదేశమిచ్చి దనుపుము శౌరీ॥ ౧౦.

## సావేరి-ఆది.

ప. రామ రామ శ్రీరామా రామా। రామయనుటయు నా [వంతు॥

అ. ఏమరకను నను। పామరుడనకను। భూమిని నేలుట నీ [వంతు॥

చ. దాసులఁబ్రోచిన దాశరథి నీవు। దోసిలొగ్గుటయు నా వంతు దాసపోషనా। దోసములెన్నక వాసిగ నేలుట [నీ వంతు॥

చ. పన్నగశయనా పతితపావనా। సన్నుతించుటయు నా వంతు కన్నతండ్రివలె గోర్కెలిచ్చి దయ నన్ను బ్రోచుటయు నీ వంతు రాతిని నాతిగ జేసిన సీతారామ నుతించుట నా వంతు॥

చ. పాతకములు బడగొట్టి బ్రోచుటయు పరమపావనా నీ [వంతు

చ. పక్షివాహన రక్షకుండవని। దీక్షగవేడుట నా వంతు కక్షవహింపక దక్షణమే నను రక్షణసేయుట నీవంతు॥

చ. ధరను నాగ్గస పురనివాసయని ధ్యానించుటయే నా వంతు॥ కరివరదా నను కరుణను బ్రోచుట కొంగుదెంచుటయే నీ వంతు

క. శ్రీరమణ నీదు నామము
నారసనను నిల్పుదెప్పుడు నరహరి యిపుడే।

సార కృపనన్ను గావుము ॥
కోరిక లిడి జొన్నపాటి కోదండారామా ॥

కాంబోది—అట.

ప॥ రామ రామ రఘువంశతిలక శ్రీ! రామ శరణు శరణు
అ॥ కామజనక శౌరీ రామనన్ను వేడ్క గావు శరణు శరణు।
చ॥ సూర్యవంశతిలక సుగుణాంబునిధి దయజూడు శరణు శరణు। వేరుసేయకనన్ను। వేడ్క బ్రోవుము నృపవీర శరణు శరణు।

చ వాతమతినిత్తునో యినవంశదీప నీ। కృతిని శరణుశరణు॥ శతముఖనుత రామ। పతితపావన నన్ను సాకు శరణు [శరణు।

చ॥ దశరధనందన శశిధర నుతగుణని। ధాన శరణు శరణు॥ శిశువై యుండి రక్కసుల గూల్చు। మున్యవనకేలో శరణు [శరణు॥

చ॥ దాసుల హృదయమున దాగియున్న సుగుణధామ శరణు శరణు। మోసపుచ్చక దయజేసిమాన్ప నా। గాసి శరణు శరణు॥

చ॥ ధరలో జనార్దన। పురనివాసగిరి। ధైర్య శరణు శరణు। శరణాను దాసుల గరుణ బ్రోచు భక్తవరద శరణు [శరణు।

కం॥ శ్రీహరి నిను బ్రార్థించెద
శ్రీహరి సకలాంతరంగ చిన్మయరూపా।
శ్రీహరి నను వే బ్రోవర।
శ్రీహరి ప్రహ్లాదవరద శ్రీలక్ష్మీశా॥

వ॥ అనుచు శ్రీహరిని నుతియించుచున్న కొన్ని దినంబులకు నొక పుణ్యకాలంబున తద్గ్రామస్థులగు భగవద్భక్తులచే నిర్మింపంబడిన రామాలయంబున కమేయసుగుణ గరిష్ఠులును, పరమభాగవత శ్రేష్ఠులును పుణ్యపురుషులు నగు జనులును, మఱికొందరు పుణ్యాత్ములును నరుదెంచి యద్దేవున కభిముఖులై నిల్చి, ఓం నారాయణాయనమః, సూర్యచంద్ర నేత్రాయ నమః, దశరథనందనాయనమః, ప్రహ్లాదనారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాది పరమభాగవత వినుతపాదారవిందాయనమః, భక్తపాలకాయనమః యని స్మరింపుచు నర్చన వందనాదులనర్చి యొక్కచో గూర్చుండి భగవద్గోష్ఠినున్నతరి వెంకటదాసుడు స్వేచ్ఛ నచ్చటికివచ్చి వారింగాంచి పరమానందంబు నొంది

గీ॥ "భక్తులే నేను నేనయూ భక్తులరయ భక్తులకు నాకు భేదమావంతగలదె"

యను భగవద్వాక్యంబుగలదు. గావున వీరా శ్రీహరి స్వరూపులు, యీ పుణ్యాత్ముల దర్శనంబున నా జన్మంబు తరించె, కృతార్థుండనైతినని యుప్పొంగుచు నా శ్రీరాముని యడుగుదమ్ములంబడి యానందబాష్పంబుల దత్పదంబులం

గడిగివేచి యప్పరమ భాగవతులకు వేర్వేరదండప్రణామంబు లొనరించి వారి దీవెనలం గైకొని తద్దర్శన స్పర్శనల సల్లాప జనిత పరమాహ్లాదంబున మేను మరచి కొంత వడికి దెలసి శ్రీహరి నిట్లు నుతింపందొడంగె.

ముఖారి, ఆది.

ప॥ పట్టువిడువ పట్టువిడువను శ్రీహరి నిను వేడ॥ పట్టు॥

అ॥ పట్టిన పట్టు నేవిడువ వట్టిమాటకాదు నరహరి। గట్టిగ
నను బ్రోవకున్న నాచువారిగొవుదు శౌరి పట్టు॥

చ॥ అష్టదిక్కుల నాలువేళ్ల యిష్టములేక నోప్రోడ। అష్టా
క్షరిచే నిను స్మరియించెద. కష్టము ద్రెప్పుము కరివరదా.

చ॥ దాసులను గాచితివని విని దశరథతనయా నుతియించెద
దోసముల బోనొట్టు నన్ను। దోషరహిత బ్రోవర
[ తండ్రి॥ పట్టు॥

చ॥ గట్టిగా కేశవ నీవు నాపట్టు గలిగియుండవేని యీ
పట్టినపట్టు విడువను పరులను నే వేడబోను। పట్టు॥

చ॥ ఆపదలనెడబాపుమనుచు। తేపతేపకు నిన్ను వేడెద। ఆ
పదోద్ధారకనాదు పాపములబడ జమ్మిబ్రోవర॥ పట్టు॥

చ॥ ఎక్కువని యితరదైవముల। నెప్పటికి నే వేడ శరినుత।
దిక్కునీవని మొక్కెద నా। దిక్కునీవై బ్రోవు
[ మయ్య। పట్టు

చ॥ గట్టిగ జనార్దన పురమున । కట్టడిగ శ్రీ లక్ష్మిని గూడి । గుట్టుగా దేవాలయమునను । కట్టువడి నివసించిన శ్రీ హరి ॥ పట్టు విడువ పట్టు విడువను ॥

కం॥ పక్షి పతిగ మన భక్తుల
పక్షపువాడవని నీదు పాలబడితి । నక్ష
కక్ష వహింపక శౌరీ ।
తక్షణమే బ్రోవుమయ్య తారకనామా ॥

నాదనామక్రియ ఆది.

ప॥ జాలమేల శ్రీరామా । శౌరీ స్మరియించెద జాలిలేదా
[రఘురామా ॥

అ॥ జాలిలేక నన్నేలకున్న బ్రతి। మాలియు నినుహరి ప్రస్తు
తింతు యిక ॥ జాల ॥

చ॥ అన్నా నిన్నే వేడెద । నిటలాక్ష వినుత కన్నులయందు
నిల్పెద । పన్నగశయనా పన్నరక్షకా । వెన్న దొంగ
నిను సన్నుతించెదను ॥ జాల ॥

చ॥ పోషింపుమయ్య శ్రీహరి । దోషుడనని । భాషింపగ
దగదు కంసారీ । ఘోషబడక నాకోరకలొసగర । దో
షరహిత నే దోసిలొగ్గితిని ॥ జాల ॥

చ॥ దండి యసురుల బట్టి। ఖండనమునను । చెండి వేసిన శౌరి
యుండజ వాహన పుండరీకాక్షయండ జేరెదను కుండలి
[శయనా ॥ జాల॥

చ॥ ధరను జనార్దన పురమందుండె। శ్రీరామచంద్రి। కరుణ పురజనుల బ్రోచుమండి। కరివరదుడ నిరతము తారక మూ నరగున వెంకటదాసున కీయర ॥ జాల॥ ౧౫.

కం॥ హరిదాసుల రక్షింపను
కరమందున మున్ను బిరుదు గట్టితివని నే
కరుణాళూ నిను వేడెద
కరుణ తలిర్పంగ బ్రోవగదరా శౌరీ॥ ౧౬.

నాదనామక్రియ- ఆది.

ప॥ ఏమిరా రామా యేమిరా పల్కవదేమిరా శౌరి॥

అ॥ కామజనక నా దేవుడవని నీ। కోమలపదములు గొలిచి మొక్కినను ॥ యేమిరా ।

చ॥ ఎన్ని విధంబుల నన్నుతించినను। పన్నగశయనా పాలింపవహో ॥ యేమిరా ॥

చ॥ దంశివాడవని యండను జేరితి। పుండరీకాక్షుయ। జాడిత స్వరూప । యేమిరా ॥

చ॥ కరివరదుడవని। మఱి మఱి వేడితి। గరుడగమన నను కరుణను బ్రోవర ॥ యేమిరా ॥

చ॥ కూరిమి వెంకటదాసుని మొరవిని తారక మొసగుచు। గోరిక లీయరా। యేమిరా॥ ౧౭.

కం॥ పక్షివరి గమన నాపై
యక్షణంబగు దయాల హరిని బరవుచుఁ
యీ క్షణమున రావేవ
ద్మౌపణ చేలంబు లిచ్చియేలవె కృష్ణా॥

కం॥ నారాయణ నీ నామము
కూరిదడ జామీళు డెపుడు గోరి యూడిక నీ
నారాయణుఁడను కొమరుని
పేరున బిలువంగ బ్రోవవే సత్య.రణా॥

వ॥ అనుచు ననేక విధంబుల శ్రీహరిని స్మరింపుచు స్వామీ
నాతో బలుకవా? పలికి తారక మీయవా? యని పలికియు,

కం॥ పలుకవు తారక మీయవు
పలుమారుల్ వేడుచున్న పన్నగ శయనా!
నలువను గన్న ముకుందా
యలుకా తగదయ్య చూడ నన్యుని గాగ॥

కం॥ తారక మిచ్చిన సరియె
తారక మీకున్న రాగ తక్షణమే ని
న్నారడి బెట్టెద శౌరి
గారడి వాడనుచు వేయిగతుల ముకుందా

వ॥ అనుచు నద్దేవళమున శ్రీహరిని బెక్కు విధంబుల నుతిం
పుచు నో కేశవ, యో మాధవ, యో పుండరీకాక్ష
యో దామోదర, యో జనార్ధన, యో యచ్యుత, యో
యనంత, యో జగన్నాథ, యో భక్తవత్సల, యో దీనశరణ్యా,

హో యాపద్బాంధవ, హో గోవింద, హో వైకుంఠవాస, నాకొకపరి దర్శనం బీయవా? యిచ్చి యొక మాటాడవా? మాటాడి తారకం బొసంగవా? యనుచు బహుమారు లెట్టించి పలుకకున్న నాయాధంబగు వైరాగ్యంబునదను త్యాగంబునకు నిశ్చయించి చేతనున్న తంబురా తాళంబులక్రిందనుంచి యూర్ధ్వముఖుండై శ్రీహరియందు చిత్తంబు జేర్చి తత్ప్రయత్నం బరయుచుండు తరి నచ్చోనున్న భగవద్భక్తు లదిచూచి యొకరి మొగ మొకరు చూచుకొనుచు విస్మయచిత్తులై వెంకటదాసుని దృఢవైరాగ్యంబునకు సంతసించి యో భక్తుండా నీకిట్టి వైరాగ్యంబు కల్గుటకు కారణమేమని యడిగిన వారిం జూచి మకుళిత కరకమలుండై యో మహాత్ములారా! వినుండు.

శ్లో॥ సాధూనాం దర్శనం పుణ్యం। స్పర్శనం పాపనాశనం।
భాషణం తీర్థ భూతం స్యాత్। సదనం మోక్షదాయకం.

వ॥ అను ప్రమాణంబు గలదు గావున మావంటి దీనులకు మీవంటి సత్పురుషుల దర్శనంబున నేకదా జన్మసాఫల్యంబు గా గలదు. కృతార్థుండనైతి ననుచు వారికి దండ ప్రణామంబు లాచరించి యో మహాత్ములారా,

క॥ మీరల నడిగిన ప్రశ్నకు
గారణమున్నదను నేను కడు భక్తి మెయిన్।
ధీరమతి వేడితిని నే।
తారక మిమ్మనుచు సుగుణధాము నాప్రేమన్॥

వ॥ అనినవారిలో సరస్వతి శేషయ్య యను భక్తాగ్రేసరుం డిట్లనియె.

గీ॥ పంచపది. ఎద్దిబహువిధ దురితంబు లెల్లఁబోలు ।
నెద్ది సకలేప్సితంబుల నీయఁజాలు ।
దేనినార్యులు నాకుపదేశమిడిరో ।
దేనిఁగోరుచునుంటివో మానసమున ।
దాని మహిమంబు దెలిపెద దయదలిర్ప ।

కం॥ తారకమె రాముఁడనుచుఁ ।
దారకముఁ శివుఁడు మదిని ధ్యానించి లన
త్సారముగని తాగౌరికి
తారకముం దెలియ జెప్పెదగ్గయు బ్రీతిఁ ॥

కం॥ గౌరికి నొసగిన తారక
సారముగని [illegible]మండ్రు సన్నుతపసులా
తారక మొసంగెదను నే
కోరికలర నీకు నేమగొనుముర శిష్యా ॥

కం॥ తారకమే యోంకారము
తారకమే నిండియుండెఁ దాభువనములఁ ॥
తారకమగు యీపావన
తారక ముపదేశమిచ్చెదఁ గొనుమిపుడే ॥

వ॥ ఇట్లా భాగవత శిఖామణి తారకమిచ్చెదనని వక్కాణింప నంత వెంకటదాసుండు పరమానందంబునొంది యో మహాత్మా! ఇదెంతటి సుదినము నేనెంతకాలము నుంచియో

తారకోపదేశంబు సేయందగు గురువర్యుండు లేక నలజడి వడుచు నాదయాళుండగు శ్రీహరి నే యుపదేశమిమ్మని చిర కాలమునుంచి వేడుకొనుచుండ నేటికా శ్రీయఃపతికి నాయం దనుగ్రహము గల్గెగాబోలు మీరూపంబున సాక్షాత్కరించె నాహా, మీరా గోవిందులుగా నాడెందంబునకు దోచుచున్నయది. నేడుగదా నాజన్మము సాఫల్యమునొందినది, యిప్పటికి గదా కృతార్థుండనైతినని యనుచు నాతని యడుగులంబడి యానంద బాష్పంబులం గడిగి మఱల నిజశిరంబున నాభక్తాగ్రేసరు పాదంబుల గడిగి యాతీర్థంబుల దనపై జల్లుకొని కొన్ని తనివిదీర గ్రోలి నిల్చి మహాత్మా నన్నుకడతేర్పవే యని చరణంబులంబడి పట్టువీడక నట్లనె యున్నంత నాపూజ్యుండా సంకటదాసుభక్తి విశ్వాసంబులకును వైరాగ్యంబునకును సంతసించి శిష్యా శుద్ధచిత్తోభవ యని దీవించి తన చేతులను లేవనెత్తి కూర్చుండ వెట్టి, బంగారునకు బరిమళము గల్గినట్లును యద్దమునకు మెరుగబ్బినట్లును వత్సా యిదిగో తారక ముపదేశమిచ్చుచుంటి గైకొమ్మని,

కం॥ శ్రీరామ నామమును యీ ।
తారక సారామృతంబు ద్రావుమి కేవుడా ।
శ్రీరాముడు నీ కిచ్చును ।
సారంబగు నమృతపదవి సరగున శిష్యా ॥

వ॥ ఇట్లుపదేశించి మఱియును,

(సీతారామాంజనేయంలోని పద్యములు)

కం॥ ఆది పరబ్రహ్మపరిత ।

పాదక మత్యంత పరమపావనము సుమీ
యీదివ్య మంత్రరాజము
మోదిత ధర్మార్థకామమోక్షప్రదము ।

సీ॥ నిఖిలరోగంబుల నిర్మూలనము గాదము ।
భవభయంబులనెల్ల బారదోలు ।
సంకటంబుల బట్టాప చాలు గావించు ।
రోలయు నా పదలను నులిమివైచు ।
శాత్రవ విజయ బు సతతం బు సమకూర్చు
పాలించు పాపులకు దుఃఖములను ।
తలపోయకుండ దుర్దశలను దోలించు
సకల సౌఖ్యంబుల సంగ్రహించు

గీ॥ పరమపావన మంగళ ప్రదము గాన
కలిత ధర్మార్థ కామమోక్షములలోన ।
నీసను భక్తుల కొసగని దేది లేదు
యేమి చెప్పుదు శ్రీరామనామ మహిమ ॥

వ॥ అనుచు సీత ఆంజనేయున కుపదేశించె గావున,

కం॥ తారకునే ప్రార్థింపుము ।
తారకమే చింతలన్ని తద్దయు బాపున్
దారకునే పూజింపుము ।
తారకమే నిన్ను శివ్యదయకడ తేర్చున్ ॥

మధ్యమావతి — ఆట.

ప॥ దర్శనమిచ్చున్ శిష్యుడశౌరి దురితము లావ్వరున్ ॥

అ॥ దశరథ సముద్భవు నాదనుజారి త్వరలోన । దశరథ తెలి పగుచు దనిపె నంబరీషు ॥ దశరథ ॥

చ॥ సరగున మకరి । శిరము చక్రమున దరిగి । కరిని గాచిన శ్రీ । హరి నీకు లక్ష్మిత్లో ॥ దశ ॥

చ॥ నారదముని మెపుకు । నారసింహాయనుచు । పారాయణము సేయు । నారాయణమూర్తి ॥ దశరథ ॥

చ॥ ధరలో జనార్దన । పురవర స్వామిదై । సరగున భక్తుల । సంరక్షించు హరి ॥ దశ ॥

వ॥ ఇట్లీ గాధ కర్త్రాగ్రేసరుండు తారకనామ ప్రభావంబు దెలియం జెప్పి శిష్యుని యభిప్రాయంబు గ్రహింపగోరి యో శిష్యుడా నే నీయందగిన తారకంబను నిధానంబు నీకిచ్చితి, నింక నీయందగు గురుదక్షిణంబు నాకిమ్మనిన వెంకటదాసుం డిట్లనియె, నో మహాత్మా మీర లనుగ్రహించినది దివ్యజ్ఞానము. అట్టి జ్ఞానంబున విచారింప నీ చరాచరప్రపంచంబునకును మీకును నాకును భేదం బిసుమంతయుం గానరాకున్నయది. ఇదియుం గాక నిష్కామి కీయందగిన దక్షిణయును లేదు. అయినను శ్రీనారాయణ స్వరూపులగు మీరు కోరితిరి. కావున నీ తారకనామ పారాయణఫలం బొసంగెద గొనుండనిన నంత నా గురుం డమితానందంబునొంది యో పుత్రా,

"శ్లో॥ బ్రహ్మణోన్యం నకించన ।" అను న్యాయంబున బ్రహ్మముకన్న వేరు కొంచమైనను లేని మాట నిజమే. అట్టి జ్ఞానంబలవడెనో లేదో యను సంశయమున నే నిట్లు కోరితిని.

నీవు నిహ్కామివై యీయరాని ఫలంబిచ్చెదనంటివి. గావున దానినే పరిగ్రహించితినన్న శిష్యుని తన తొడలపై గూర్చుండం బెట్టుకొని పుత్రప్రేమచే గౌగలించి వత్సా యెన్నియిడుమలు వచ్చినను శ్రీరామనామస్మరణము మాత్రము విడువ వల దనియు శత్రుమిత్రులయెడ సమభావంబున మెలంగుమనియు సమలోష్ఠకాంచనుడవును నీమణత్రయ దూరుండవును నగు మనియు నిట్లు మెలంగిన నపవర్గం బరచేత నుండుననియుం జెప్పి హరిభక్తులతో గలిసి యానందంబున శ్రీహరి నిట్లు స్మరిం పందొండంగె ఎల్లవినే,

ఆనందభైరవి-అట.

ప॥ గోవింద గోవింద । రామగోవింద । గోవింద యోగో వింద గోవింద॥

అ॥ గోవిం దాయన్నారము నే । కొల్లగా భక్తులతో । నారా గింపగల్గె । నాహా భాగ్యమేమో । గో ।

అ॥ సూర్యవంశజ రామ । సురనుత శ్రీరామా । గరుడ గమనహరి । గంరాజరక్షక ॥ గో ।

చ॥ మచ్ఛమై జలధి । జొచ్చి సోమకు ద్రుంచి । తెచ్చి వేద ము లజున । కిచ్చిన యచ్యుత॥ గో ।

చ॥ మందరగిరిధర । మధుసూదన శౌరి । యిరదిరాధవ గోవిందా మురారీ ॥ గో ॥

చ వాసుదేవ కృష్ణా । వనమాలధర శౌరి । దాసులమగు మ్మము మోనవుచ్చకుమయ్య ॥ గో ॥

చ వెంకటదాసుని । సంకటములబాపి । శంకలేకబ్రోవుము
శంఖచక్రధర ॥ గో ॥

చ॥ ధరను జనార్దన పురవాస శ్రీరామ । సరగున భక్తుల । కరు
ణాత్మ బ్రోవర ॥

వ ఇట్లా భక్తులతో పరమానందంబున మేను పులకరింప శ్రీ
హరిని స్మరింపుచు నాడుచుబాడుచు తన నివాసంబునకు జన
నంత వెంకట దాసుండు శ్రీరాముని మందిరంబునసే శ్రీహరి
నిట్లు స్మరింపు చుండె. ఎట్లనిన,

కం॥ నారద వంద్యా శ్రీహరి ।
వారణ పరిపాల సుజన పాలనశీల ।
భారము నీదే బ్రోవగ
నీరజదళ సదృశయన నీరధి శయనా ॥

సావేరి. ఆట.

ప॥ సాధువు నాకీవు డాదితారకము బోధపరచెను విను
మనసా ॥

అ॥ వేదములకు నది మూలమనుచు నే । భేదము లేని యచల
మనుచును ॥ సాధువు ॥

చ॥ పరిపరి విధముల । భవుడు స్మరించె । పావన మంత్రిం
బిదియ యనేగా । స్థిరమతి మున్మని । శింపాలులు నుడు
వగ । నిరువుగ గాచిన దిదియ యనేగా ॥ సా ॥

చ॥ పృథివి నంతటను గుదురు జేసికొని కదలకున్న దీతారక
మ్ముర । అదరిపడుచెప్పుడు హరిహరీ యనని । యంధులు
గన రీతారకమ్ముర ॥

చ॥ పాపల నడుమను । వ్యాపించిన యా ఆపోజ్యోతియ
తారకమ్ముర । చూపును మనసాక రూపము జేసిన దాప
గుననె నీ తారకమ్ముర ॥

చ॥ సరస్వతి సేవయ। కరుణను జెప్పెను। సర్వము దెలియగ
తారకము । స్థిరమిదె గురుసిదె యనుచుర ।
స్థిరమతితో స్మరియింపు మనెర ॥ సా ॥

వ॥ అనుచు బరమానందంబున మరల నిట్లనియె.

కం॥ హరిని స్మరింపని మనుజులు
హరినిం గన లేరి కెప్పు డవనిస్థలిలోర
హరిని స్మరించిన జనులకు ।
హరిదర్శన మిచ్చి బ్రోచు నతిమోదమునర

నా ద నా మ క్రి య — ఆట.

ప॥ జీవుడ గోవిందయనరా । జీవా గోవింద నామా
మృతము గ్రోలు మెపుడు ॥ జీ ॥

చ॥ శ్రీరామనామ । నుస్థిరముని భువి వెద ।
జల్లె చిన్మయుడు సద్గురు చూపుతో ।
కల్లగ దీనామ యుల్లాసమున వేడు ।
మళ్లి జన్మానికి మరలి రానేరావు ॥ జీ ॥

చ॥ పంచకోశా తీతమాయుండి యెపుడు ప్రి । పంచ జీవుల బ్రోచే దీనాథు । మంచి జపముసేయ సంచితముల బాపు చంచల ముడిగి నీవు । మంచి మనసుంను ॥ జ ॥

చ॥ సూరిజనులు సిద్ధ । సురలు మును లెపుడు ను। సూటిగ స్మరియించే దీనామము । క్రూరమ లో కామ । క్రోధాదుల జయించి । మేరదప్పక నీవు మేలైన గురితో ॥ జీ ॥

చ॥ ధరలో జనార్దన పురమున వెలశిన । హరిని సద్భక్తుని స్మరియించి నతడు । కరుణ జూపును జనుల । గాచుచుండు సుమ్మా మరువకుమా శ్రీహరిని మదిలో నెల్లప్పుడు ॥ జీ ॥

వ॥ ఇట్లు బోధింపుచు పరమానందంబునం జొక్కుచు నిట్లని పాడం దొడంగె, నెట్లనిన

ఆనంద భైరవి. ఆట.

ప॥ ఆనంద మానందము । పరమానంద । మానందము ఆనంది వాహను । డానందమున నుండు । శ్రీనామ మొప్పుడు । చిత్తమందుంచు కే ॥ యా ।

చ॥ కుంజరేంద్రుపైన । యెదురుగ బవళించు నందజ వాహుని యాశ పాడుచుంట ॥ యానం ॥

చ॥ కృష్ణా కృష్ణయనిన । గిష్టముల దలచు శ్రీ కృష్ణుని సతతము గీర్తన సేయుటయే ॥ యా ॥

చ॥ పశుపతినిబోధించిన । పరమపురుషునెప్పుడు । వశునిగ జేసు
కొని । వదలకుండుట ॥ బ్రహ్మానంద ॥

చ॥ ధరలోజనార్దన । పురవాసుడౌ హరిని । మరువక నెల్ల
పుడు । మదిని స్మరించుటయే ॥ యా ॥

వ॥ అనుచు వెంకటదాసుండు సనకాది ముఖ్యంబరానాధుని
హృదయంబునం బొందుపరచి యానందాతిరేకంబున తన
హృదయంబునకు బోధసేయుచు సచ్చోటు వాసి నిజమంది
రంబునకుం జని మరలనాలోచింపుచుని స్మరింపుచు నిట్లనియె.

కం॥ జీవుడు దేవుండనుచుం
గావరమున నుండువుసంత కరివరదుండా ।
జీవుండగు నాయువురా ।
జీవులకు సతీత్వైక చిన్మయు డనగా ।
జీవుల బోధించెడు హరికిని ।
జీవుడ దాసుండవగుచు జేరుము భక్తిన్ ॥
కావరముల నడగింపుము ।
భావమునను బూజసేయు మతని యడుగులన్ ॥

సావేరి-ఆది.

ప॥ తారకబ్రహ్మము నేనే యనినను । తత్క్షణమే భక్తిమాన
వలెన్ ॥

అ॥ కోరికలెల్ల నశింప జేసి పైకొండగుహను తానుండవలెన్॥

చ॥ నిరాకరుడను నేనే యనినను । నిర్గుణిమై తానుండవలెన్

నిరాకరింపుము నీవ నేననుట । నిశ్చయ చిత్తమునిల్ప
వలెఁ ॥

చ॥ అహం బ్రహ్మాస్మ్యను భావంబున్నను । నచలముగా నే
యుండవలెఁ ॥
ఇహపర సౌఖ్యములెల్లను గోరక । నెప్పు డయాపర
నుండవలెఁ ॥

చ॥ దండిగ వెంకటదాసుండెప్పుడు । తారకబ్రహ్మమే నవకళా
కుండలియందున వగశముగా ముని । గురిగా నిల్పి స్మరించు
కొనెఁ ॥ తా ।

వ॥ ఇట్లు వెంకటదాసుండు నేవ తారకబ్రహ్మమని తలంపక రాజు భృత్యన్యాయంబున శ్రీరాముని భక్తి భావంబున సేవింపుచు మున్ను శ్రీరామచంద్ర పదారవిందానవరత ధ్యానంబున బ్రహ్మైక్యంబై భుక్తిమాని ముక్తి నపేక్షింపుచు గోర్కెలుడిగి ప్రపంచంబు మరచి జీవుని సహస్రారంబున జేర్చి దీపంవలె జలింపకనున్న వాల్మీకి చందంబున నుండుటను వశంబుగాక చావుం బుట్టుకయు లేని జీవనమార్గవిద్య దెలియజాలక దుష్కర్మంబుల నశింపంజేసి సద్గోష్ఠిచే మెలంగుచు భగవజ్ఞానానుభవంబున మేను మరచుచు శ్రీహరి సాక్షాత్కరించినట్లు శరీరం బుప్పొంగ నృత్యంబు సల్పుచు.

కం॥ జూడర కరుణా దృష్టిఁ
వేడర నేపదుల నెపుడు విశ్వాత్మకనీ ।

కాదర నిను వీడర కా ।
పాదర రాజేశ్వర భక్తపాలనశీలా॥

వ॥ ఇట్లుప్పొగడు భగవంతుని స్మరింపుచు పరమానందంబున నుండు మరియు.

కం॥ ఈ తారకచరితంబును ।
చేతోమోదంబుతోడ జెప్పిన విన్నన్ ।
ఖ్యాతిగ వ్రాసినవారు బు
నీతులగుచు బొందగల రనేకసుఖంబుల్ ॥

కం॥ సీతారామాహరి యం
చీతీరున వేడుకొనిన నీసుచరిత్రం
బే తారకపద మొసగుచు
నాతాదార్క్యముగ విశలయశమున్నించున్ ॥

కం॥ నారాయణ యని యొపుడున్ ।
భారాయణ సేయువారి గాధలు మానన్ ।
కోరిన కోరికలిచ్చున్ ॥
భూరిదయ న్ననుపుశౌరి పుణ్యులసేయున్ ॥

వ॥ ఇట్లు రమ్యంబుగ దెలియంజెప్ప నాపుణ్యపురుషుండు విని విస్మయానందంబును బొందుచునుం బేనగొన, మాయుకే వెంకటదాసుండెంతయు పుణ్యాత్ముండని యగ్గింపుచు నింటికిం జనికొ సంతో దక్కిన జనులును వారివారి నిజ నివాసంబులకుం జనిరి.

మాలిని నిరుపమ గుణజాలా । నిత్య కల్యాణ శీలా ।
కరపరివృత పాలా । కాంతిమత్స్వర్ణ వేలా ।
ఖరదనుజవిశాలా । ఖండితాఘౌఘమాలా ।
సరసహృదయలీలా । జానకీ ప్రాణలోలా ॥

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ ।
మహనీయ గుణాత్మనే
జొన్నపాటి నివాసాయ
దేవ దేవాయ మంగళం ॥

గద్యము. ఇది శ్రీజొన్నపాటి పురావాస దయామందిర
శ్రీరామచంద్ర కటాక్ష పాత్ర వెల్లటూరి గోత్ర పవి
త్ర సుకవి జనవిధేయ కొండపల్లి వంశ స్వయం
బుధ రాకాచంద్ర సమంత రామగోవింద
రత్న తనూభవ దేవారెడ్డి ప్రపౌత్ర
వీరారెడ్డి పౌత్ర తాతిరెడ్డి
పుత్రి వెంకటరావు విరచి
తంబగు సీతారామ
ప్రభావంబను
యక్షగాన
ప్రబంధము
సంపూర్ణము.

